


# రైతులకు అండగా ఊరికో సాగు న్యాయ నేస్తం

## తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో ప్రతి గ్రామంలో ఒక రైతుకు భూమి, వ్యవసాయ చట్టాలపై ఉచిత శిక్షణ. సాగు న్యాయ నేస్తంగా నియామకం

దుక్కి దున్నే నాటి నుండి పండించిన పంటను మార్కెట్లో అమ్మేదాకా రైతులు ఎదుర్కునే సమస్యలు ఎన్నో. తినడానికి తిండి కోసం పంటలు పండించే దశ నుండి విపణిలో విక్రయించడం కోసం పండించే దశ వరకు వ్యవసాయ రంగంలో ఎన్నో మార్పులు, మారుతున్న సవాళ్లు. ఆ మార్పులకు తగ్గట్టుగా సాగు సాఫీగా సాగడం కోసం పలు చట్టాలు, నియమాలు అమలులోకి వచ్చాయి. భూమి, వ్యవసాయం, ఆహారానికి సంబంధించి ఇప్పుడు ఒక్కో రాష్ట్రం లో రెండు వందలకు పైగా చట్టాలు ఉన్నాయి. చట్టాలు తెలిసి ఉండి, వాటిని వినియోగించుకొగలిగితెనే ఏరువాక సాగే పరిస్థితులు వచ్చాయి.

భూమి సమస్యలు ఉత్పన్నమైనపుడు; నాణ్యతలేని విత్తనాలు, ఎరువులు, పురుగు మందుల వల్ల నష్టం వాటిల్లినప్పుడు; మార్కెట్ మోసాలు జరిగినప్పుడు; పంటల భీమా అందనప్పుడు; ఒప్పంద వ్యయవసాయం చేస్తున్నప్పుడు - ఒప్పందం వ్రాసుకునేటప్పుడు, వివాదం ఏర్పడినప్పుడు; కొత్త వంగడాలు నమోదు, రైతు హక్కుల చట్టం క్రింద హక్కుల రక్షణ కోసం; సేంద్రియ సాగు - సర్టిఫికేషన్ పొందడంలో, వివాదాలు వచ్చినప్పుడు; పంట రుణాల వివాదాలు వచ్చినప్పుడు; బోరు / బావి కోసం అనుమతులు పొందాల్సినప్పుడు; ప్రభుత్వ పధకాల లబ్ది పొందడంలో సమస్యలు వచ్చినపుడు ఇలా పలు సందర్భాలలో చట్టంతో రైతులకు అవసరం ఏర్పడుతుంది. సమస్యల పరిష్కారానికి అధికారులను ఆశ్రయించాల్సి వచ్చినప్పుడు, కోర్టులకు వెళ్లాల్సి వచ్చినపుడు న్యాయ సేవలను

పొందడం అవసరం. కానీ చట్టాలపై  అవగాహన లేక, న్యాయ సహాయం అందక రైతులు వారికి మేలు చేసే చట్టలున్నా లబ్ధి పొందలేక పోతున్నారు.  రైతుల సమస్యల పరిష్కారానికి తగు న్యాయ సలహాలు, సేవలు అందించాల్సిన అవసరం ఎంతో ఉంది.

రైతులకు న్యాయ సలహాలు, సహాయం అందించడానికి ప్రతి ఊరిలో కనీసం ఒక రైతుకు చట్టాలపై శిక్షణ ఇచ్చి  సాగు న్యాయ నేస్తం గా తయారు చేయాలని లీఫ్స్  సంస్థ సంకల్పించింది. భూమి సునీల్ ఆధ్వర్యంలో నడుస్తున్న ఈ  లీఫ్స్ సంస్థ ద్వారా భూమి, వ్యవసాయానికి సంబంధించి  రైతుల న్యాయ పరమైన అవసరాలను తీర్చే ప్రయత్నాలు చేస్తున్నాము.  రైతుల కోసం భూమి హక్కుల పరీక్షా కేంద్రాన్ని ఏర్పాటు చేసాము. సాగు న్యాయం కార్యక్రమం ద్వారా వారికి ఉచిన న్యాయ సేవలు అందిస్తున్నాము. భూ న్యాయ శిబిరాలను నిర్వహిస్తూ రైతులకు ఉచిత న్యాయ సలహాలు అందిస్తున్నాము. భూమి, వ్యవసాయ చట్టాలపై రైతుల కు అవగాహన కల్పించే పలు కార్యక్రమాలు చేస్తున్నాము. ప్రతి వారం న్యాయ గంట కార్యక్రమం నిర్వహించి రైతులకు ఫోన్ ద్వారా ఉచిత న్యాయ సలహాలు అందిస్తున్నాం. నల్సార్ న్యాయ విశ్వవిద్యాలయం, న్యాయ సేవల అథారిటీలతో కలిసి రైతులకు ఉచిత న్యాయ సేవలు అందించే పలు కార్యక్రమాలు చేస్తున్నాము. ఇప్పటికే వెయ్యిమందికి పైగా గ్రామీణ యువతకు సాగు న్యాయ నేస్తాలుగా  శిక్షణ ఇచ్చాము. ఈ కార్యక్రమం కొనసాగింపుగా తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో ప్రతి గ్రామంలో ఒక రైతుకు చట్టాలపై శిక్షణ ఇచ్చి  సాగు న్యాయ నేస్తంగా తయారుచేయాలని సంకల్పించాము.

## ఉచిత శిక్షణ, సాగు న్యాయ నేస్తంగా నియామకం

రెండు తెలుగు రాష్ట్రాలలో ప్రతి గ్రామం నుండి ఒక రైతును ఎంపిక చేసి వారికి లీఫ్స్ సంస్థ భూమి మరియు వ్యవసాయ చట్టాలపై ఉచిత శిక్షణ ఇస్తుంది. ఇలా శిక్షణ పొందిన వారిని సాగు న్యాయ నేస్తం గా నియమిస్తుంది. వీరి ద్వారా రైతులకు ఉచిత న్యాయ సలహాలు, న్యాయ సహాయం అందిస్తుంది.

## ఎవరు అర్హులు?

- భూమి సాగు చేస్తున్న రైతు లేదా కౌలు రైతు అయ్యి ఉండాలి
- గ్రామంలో నివాసం ఉండాలి
- చదవడం, వ్రాయడం వచ్చి ఉండాలి
- వాలంటీర్ గా రైతులకు సహాయం అందించాలనే ఆసక్తి కలిగి ఉండాలి
- లీఫ్స్ నిర్వహించే శిక్షణా తరగతులకు తప్పక హాజరు కావాలి

## దరఖాస్తు ఎలా?

ఈ క్రింది వివరాలను వాట్సాప్ ద్వారా 9000222674 నంబర్ కు 30 జూన్ 2023 లోగా పంపించండి. ఎంపికైన వారికి లీఫ్స్ సంస్థ ఫోన్ చేసి శిక్షణా మరియు ఇతర వివరాలను తెలియజేస్తుంది.

పేరు:
గ్రామం:
మండలం:
జిల్లా:
రాష్ట్రం:
సెల్ నెంబర్:
విద్యార్హతలు:

**లీఫ్స్ సంస్థ తరపున**
**భూమి సునీల్**
అధ్యక్షులు

**జి. జీవన్ రెడ్డి**
ఉపాధ్యక్షులు